# CHENNAKESAWA SATAKAM.








BY,

G. KRISHNAMURTY.

# విజ్ఞాపన.

ఈ శతకము నా బాల్యమందు (అనగా) 1921 - 22 సంIIలు మధ్య నా సోదరుని ప్రోత్సాహముచే పాశర్లపూడి వేలుపైన చెన్నకేశవస్వామిపై రచింపఁబడి వెంటనే ముద్రించుటకు సిద్ధపర్చబడి కారణాంతరములచే ప్రకటింపబడలేదు. దానిని నేను యథామాతృకగా సవరింపక ముద్రించుటవల్ల నచ్చటచ్చటఁ గొన్ని దోషములు కలిగియున్నది. ద్వితీయ ముద్రణమున దోషములు పరిష్కరించి ప్రచురింపఁ గోరువాడను. సాధ్యమయినంతమట్టుకు తప్పొప్పులు జూపియున్నాను. ఈశతకముద్రణకు ముందు పద్యములు classification జేసి వ్రాయుటకు సాయపడిన మII రాII శ్రీII Y. కామరాజు, S. వెంకట దీక్షితులు గార్ల కెంతయేని కృతజ్ఞత జూపుచున్నాను.

గ్రంథకర్త.



# చెన్నకేశవశతకము.



ఉ॥ శ్రీకరమైనబుచ్చి నృపశేఖరు పట్టపుదేవి భర్తతో
లోకముఁబాసి దానచిలోఁబడఁ దఘ్నవకార్యచిహ్నమై
వీకఁదనర్చు నీపురపు పిప్పలశాఖల మూటిసెంతు నేఁ
బ్రాకట సత్కవిత్వ పరిపాటవమొప్పఁగఁ జెన్నకేశవా! 1

ఉ॥ సాయనిదీక్ష నేనొక ప్రభాతమునన్ బాలమేగివచ్చి వా
తాయనమారుతోర్మ్యులు ముదంబొనరింపగ నింట భోజరా
జీయముఁ జూచు నర్దరికిఁ జీరివచించె మదగ్రజుండు నా
రాయణమూర్తి కుందమకరంద సమోక్తులఁ జెన్నకేశవా! 2

చం॥ అతులపరిశ్రమన్బడసినట్టి కవిత్వములంతిఁ బోవఁగాఁ
గుతుకమొనర్చు కంతమునఁగూర్చు కిరీటము చెన్నకేశవున్
శతక మనేక నీతిమతసాంఘిక నిర్గుణతత్త్వసాంగ సం
స్తుతి విపులం బొనర్చుమని సోదరుఁ డేర్తెఱఁ జెన్నకేశవా! 3

ఉ॥ ఆనరొసంగువాఁడు నిఖిలాగమవేది మదగ్రజుండు సం
ధానకవిత్వ మాంధ్రము సమంచితవర్ణన వాసుదేవు గా
ధానకమింక లోటునకుఁ దక్కగ నేల రచింతు నేర్పుతన్
బోని కవిత్వసంపదను బుష్కరలోచన చెన్నకేశవా! 4

ఉ॥ ప్రేరకుఁడన్న వ్రాసి వినిపించుట యీపురినున్న నిన్ను నా
కూరకపోవు ఘుస్రము లనూనఫలప్రద హేతువుల్ నిరా
ధారకవిత్వవల్లరి యథాశ్రియ వృక్షమునై తనర్చె నీ
పేర కవిత్వమాది వినిపించుచునుండుట చెన్నకేశవా!

చం॥ పటుతర సత్క్రియిత్వ పరిపాటిని జాతకకర్మబోధమున్
ఘటన మొనర్చినట్టి కలిగండరగండని వేదలంతు ముంపగన్
బటుతర శబ్దసంతతులు బ్రాబడిఁబోక తలంపునుండ వెం
కటరమణాఖ్యమూర్తిని సుఖస్థితిగాకను చెన్నకేశవా!

## — ♦ సగుణశతకము. ♦ —

ఉ॥ సారసనేత్ర చక్రధర శౌరి జనార్దన కృష్ణ [illegible]షం
దార మురారి మాధవ గదాధర కేశవ వాసుదేవ దై
త్యారి చతుర్భుజాచ్యుత మహాంధ మధుద్విషకంసకైటభ
ద్వైరి హిరణ్యనేత్ర ఘనపాప విభంజన ॥చె॥ 7

చ॥ కాళియుదగ్ర సంహరణ కంసవిభేదన ధేనుకాది దై
త్యాళి పరాసుకారణ మహావిభవాసుర రావణాంత భూ
పాళి విమోచనాయత శుభాన్విత పాండవపక్షపాత భూ
పాళి కదిష్టవర్తన విధానచరిత్రమ ॥చె॥ ౮

చ॥ ప్రేరణదూకు హసిని హరిణి భుజంగముఁ జావఁద్రొక్కి కాం
తార తటాక కాతగ మతంగము గాచి ప్రలంబుఁజంపి శృం
గారవని సమూహముల కను పదాంకములుంచినట్టి యా
శ్రీకరులాంగ నాటుని వేఁడి నుతింతును ॥చె॥ ౯

ఉ॥ పాలిత యుగ్రసేన పరిపాలిత పాండవపంచకా సమా
లోలననంజ యాత్మపరిలోల విభంజనతత్త్వలోల వా
తూల సురద్విషాంతక విధుంతుద సంగవహేతుభూత పా
తాళ సమర్పితోగ్ర బలిదైత్య మురాంతక ॥చె॥ 10

చం॥ కమలసమీక్ష్య కక్షజిత కంచుకరాధ కుచాగ్రసాగ్ర సం
యామ యమలోకసాందిపసుతాగతకారణ కారణోద్భవా
దివశ్శివ భావజాత వివిధేచ్ఛ విభంగుర లాభలోభ పా
పమతి సుమోహనాంత కృతఖండన కారణ ॥చె॥ 11

ఉ॥ పూతకి ప్రాణసంహరణ పుణ్యజనావనధామ జీవసం
ఘాత లయాంతకవ్రజనికాయ మనోహర ధేనుకాది సం

ఘాతన పద్మయోని హరిగర్వ విభంజన రుక్మికేశ సం
ఘాత లతాలవిత్ర సుముఖస్థిరవీక్షణ ॥చె॥ 12

ఉ॥ భావజరూప పాపజనపావన రాక్షసదైత్యపంక దై
రావణ భావదగ్ధపరిరక్షితగోవ్రజ దత్తరూప సం
భావిత కుబ్జ సంయమిసభాప్రముఖ స్థిరదత్తరాజ్య సు
గ్రీవదలంతు నిన్ను పరికింపఁగఁ జేత్రమను ॥చె॥ 13

చం॥ నలినదళాక్ష మాధకజనాగ్రన శత్రుజితోగ్రచక్ర సం
కలితభుజాగ్ర పాండవనికాయసమర్ధన వంశవర్ధనో
జ్జ్వలిత దవాగ్ని భోజన సువర్ణశరీర సుధన్వకేశవాయ భూ
పాల పురుషోత్తమాచ్యుత పతంగతురంగమ ॥చె॥ 14

ఉ॥ శాంతశరీర సర్వదృశ శాశ్వత భూతకృతే భవాయ స
ర్వాంతర మానశౌరి పరమాత్మ బకారి పవిత్రదేహ ఏ
కాంతర సాక్షిభూత భవసాగర శోషణకుంభజాత భూ
తాంతరవర్తనీయచరితా మధుసూదన ॥చె॥ 15

ఉ॥ అంధకపౌండ్రవృష్ణి భువనాధిపజీవగతాసుభూత గ
ర్వాంధసుదామ సంహరణ రాసవిహారితకేశవా జరా
సంధమృతార్క జాత పశుసంఘపరీక్షక మిత్రవింద పు
ష్పంధయ నీలవేణి పరిపాలితకాముక ॥చె॥ 16

ఉ॥ ఓ రవిసోమనేత్రయుగ యో పురుషోత్తమ యో హిరణ్య రే
తారుణదేహ యో క్రతువిధానక యో ప్రభవాయ కేశిసం
హారక భక్తవత్సల మహాక్రతుపాలన పుణ్యకీర్త యో
వీరవష్ఠ తీర్థకరవేణు కరాంచిత ॥చె॥ 17

ఉ॥ నాయకదానవాంతక ప్రవర్షణ గహ్వరవర్తనీయ శాం
తాయ విశోధనాయ విజితాత్మనసాగరశోషణాయ నీ
లాయ చతుర్భుజాయ విమలాయ శమాయ కృతాత్మనాయ నా
రాయణ విశ్వభుగ్విభవరంజిత మాధవ ॥చె॥ 18

ఉ॥ సురపతియాగభంజన విశోషణ కాళియ దండశూక సం
హరణ బకాదిదానవవిపాకాసురసంఘ ముకుంద ధర్మజా
ద్వారపరిపాల శౌరి వృషభాసురజీవకృతాంతతుల్య సుం
దరనరకారిబంధితనితంబినికాముక ॥చె॥ 19

ఉ॥ యాదవసింహ కృష్ణ యమళార్జునశాపవిమోచనాంగ నా
మోదకుభాంగ రాధికవిమోహన నిర్గుణ దంతవక్త్రవి
చ్ఛేదన భూతభావన కుచేల సమర్పిత దివ్యభాగ్య దా
మోదర పారిజాతపరిమోషక శ్రీధర ॥చె॥ 20

ఉ॥ అంగనృపోపజాపకృత యత్న కిరీటికిరీటరక్షణా
నంగసమానరూప కరుణార్ణవ నారదగానలోల భూ
తాంగపతంగవాహనమతంగవరాంగవిభంగసంగతా
పాంగవిలోల భీష్మకనృపాత్మజసంగమ ॥చె॥ 21

చం॥ గురుకరుణార్ద్రదృష్టి ముచికుందునిపై ధరపై కుచేలుపై
కరిపయిఁ గుబ్జపై మునులకాంతలపై హరిపై యశోదపైఁ
బరపిన నీకటాక్షపు లవంబొకఁ గొంచెముఁజూపు నాకు నీ
చరణమునమ్మి నాఁడఁగద శౌరి గదాగ్రజ ॥చె॥ 22

చం॥ నరుపయి యుగ్రసేనుపయి నారదుపై గుహునిపైఁ గపీంద్రుపై
హరిపయి గోపికాంగనలపై గిరిపై ద్విజుపై జటాయుపైఁ
బరపిన నీకృపాంబుధిలవాంబుకణంబు నొకింత గల్పు నీ
చరణ విసర్పిమానములు చక్కఁగ నమ్మితి ॥చె॥ 23

ఉ॥ వ్యాళమునందు భక్తజనపావనుఁడౌ ధ్రువునందు గోపికా
జాలమునందు నందపశుజాలమునందు మునీంద్రులందు పాం
చాలియెడన్ వహించిన రసార్ద్రకృపాంబు తుషారమింతపైఁ
రాలుపు నీపదాబ్జముతిరంబుగ నమ్మితి ॥చె॥ 24

ఉ॥ పారునిపైఁ గుచేలుపయిఁ బావనిపై హరిపై కపీంద్రుమ
క్రూరులపై మహీంద్రుపయి క్రూరభుజంగముపై విముగ్ధలా

ధీరలయాంపు దేవకివిభీషణులందునఁ జూపినట్లు నీ
సారకృపార్ద్రదృష్టి నిడజాగిలి మ్రొక్కెద ॥చె॥ 25

ఉ॥ నారదగానలోల సుగుణాకరబృంద వనాంతమార్గ సం
చార తృణాసురాంతక తుషారమహీధరమాళి తాపసో
దార ముకుంద పాండవముదప్రద మాధవ సారసాక్ష సం
సార వికారదూరతర సంస్తుతిలోలుప ॥చె॥ 26

చం॥ పతగతురంగ సంగర కృపాకృత కౌనవభల్లు కేశ వే
శ్లిత శికచాపసంగత కులీన రథాంగకరాగ్రసాగ్ర భా
రత్ర విదితాత్మ వర్తన పరాశర పట్టణవాస వాసవా
ర్చిత పదపద్మ దుర్విధ కుచేల సమార్చన ॥చె॥ 27

చం॥ అతులగుణానురాగ వినయాంచితపార్థశతాఁగసాఁగ్రే
పతితమనుష్యపావన కృపార్ణవ ద్రౌపదిమానపాలనా
రతిపతితుల్యసుందర పరాశరపత్తనవాస వాసవా
ర్చితపదపద్మ దుర్విధకుచేలసమార్చన ॥చె॥ 28

ఉ॥ వేదములుద్ధరించి యాతశైలభరంబునఁ భూమి దాల్చి సం
వాదములోఁ జయించి యలపాండుసభన్ వృషకేతునేత్తులఁ
ఛేదమొనర్చి రాజులను చేయని దేదిధరిత్రినీవుఁ నీ
పాదమునమ్మినాఁడ నను పావనుఁజేయవె ॥చె॥ 29

చం॥ హరినిహరించినాఁడెవు సహల్యను బ్రోచితి వడ్డిశుద్ధ క్ష
శరము విఁఢంగినాఁడెవు విశాలగభీరవిదారకాంబుధో
పరినృగునెత్తినాఁడవు విపద్దశనున్నఁ గరీంద్రుఁగాచి పు
ష్కరనిలయున్వరించితివి కంజవిలోచన ॥చె॥ 30

ఉ॥ వాసవదర్పభంజన విభాస్వర చంద్రవిలోక గర్వవ
త్సాసురదైత్యమర్దనకృతాంత కిరీటిశతాంగసారథీ
వాసుకితల్పకల్పిత సుభాంగి నృగేంద్రశరీరరూపహా
నూసర వెల్లి నెత్తి నయనూనకృపార్ణవ ॥చె॥ 31

చం॥ కరమరయంగ నారదముఖాదిసనందకుచేలకృష్ణసా
గరులఁ దలంపనేల కలికాలపు ధూర్జటిఁ గోపనాదులన్
సరవిగఁ బోలఁజాల నినుఁజాలి నుతించుటలందు దీనులన్
గరుణవహించి నన్నుపుడు గావగ వేడెద ॥చె॥ 32

## మహిమశతకము.

ఉ॥ ఉరగభయంకరోన్నతశిరోపరితాండవరంగభూమి సు
సిరశయనోన్నతామలవిధిస్తవశేషభుజంగమంబు నీ
క్షీరయగతల్ప మంచుఁదరిఁగాననిసింధువుఁ గాపురస్థలం
బరిమురిఁగాద నీచరితలద్భుతమన్నిట ॥చె॥ 33

ఉ॥ నీవుఁదలంప సాగరులు నిర్జలమై నగరంబులౌను నీ
భావనచేఁ బురంబులు కబంధసముద్రములై ప్రవాహరే
ఖావిభవంబునొందుఁ నినుగావసేయు సమర్థశక్తి నా
కేవిధి నెట్లు వచ్చు? పరికింపగ మూఢుడ ॥చె॥ 34

చం॥ పరమఖలుండురావణుఁడు బాహుబలంబున లంక నేలుచున్
ఖరదుముఖాది సైనికులఁ గాపురముంచెను దండకాటవిన్
పరమమునీంద్రసంఘముల భారతదేశమునందుబాధలన్
బొరియఁగ జేయ చెల్లినవె బోరిజయింపవె ॥చె॥ 35

ఉ॥ మేకొనినిన్ను మున్ను యల మేఁటి పరాశరసంయమాశ్రమా
లోకత నచ్చిఁ గుంభజుఁడు లోలతగొన్ని దినంబులుండి ని
న్నకడఁ దాప్రతిష్ఠవెలయించిజనన్మునిఁబూడి ఛన్నమా
పోకడఁగాంచి చెన్నహరిపోలిక బల్కరి ॥చె॥ 36

చం॥ అరసివివిక్తమంచునుఁ నిజాశ్రమశాలపరాశరుండు నీ
ధరణిరచించిసంయమవిధానరతుండఁ నగస్త్యతాపసుం
డెరిఁగి దవంతవచ్చి రచియించెను నిచ్చట నీప్రతిష్ఠ ని
ర్జరపరిషేవ్యమాన జలజాలయవల్లభ ॥చె॥ 37

## —◆ శృంగారశతకము. ◆-

ఉ॥ రాసవిహారకేళి నొకరామకు రామకు మధ్య నీవు నెం
తో సమయోచితాకృతి యథోచితవేషముఁబూని గ్రోవితో
భాసిలు హస్తపద్మ మిరువాగులఁ గోపికలంటిరాగన
భ్యాసవిచిత్రలాస్యమున బాడుట నెంతును ॥చె॥ 38

ఉ॥ ఊదినగ్రోవియీలకుసముద్భవరాగవిరాగలై విశే
షాదరులై విహారస్థలికిఁ జయ్యన వచ్చెడిఁ గోపికాళికిన్
మోదరతిప్రవీణతసముద్భవకౌతుకమిచ్చి బంపు దా
మోదరు మారసత్క్రియలు బుద్ధిఁదలంతును ॥చె॥ 39

చం॥ శిరము మయూరపింఛపరిసేవితముంగను యక్షకర్దమం
బెరసిసుగంధమివ్వగ యథేప్సితగోపకుచాగ్రసంగ్రహా
భరణకరాగ్ర రాధికనవాగతవర్తులపీనకర్కశా
కరకుచపర్వతాగ్రఘన కౌశికసోదర ॥చె॥ 40

ఉ॥ వల్లరులుల్లిజొంపములపాదపపాళిఫలాదిభారముల్
బల్లముఁవంగి మార్గమిరువాగులఁ నాతపమడ్డగింప. సం
ధిల్లెడు నీఁడలన్ దిరుగు దివ్యచరిత్రునిఁ బద్మనాభునిన్
వల్లవపల్లవాధరలవల్లభు నెంతును ॥చె॥ 41

చం॥ మకరపతాకసంగరసమాహ్వయలాంఛనవేణునాద మా
గకవనవాయువీచికలఁ గర్ణరసాయనమైఁ దనర్చినన్
సకలముఁబాసి గాంతలభిసారికలై. నినుగూఁడ రాగ చెం
తకు యమునాంబు తిన్నెలకుఁ దార్చుట నెంతును ॥చె॥ 42

ఉ॥ కాననపారిభద్రనగకల్పితడోలికఖట్వమందు చం
దానన రాధకుంభకుచరాజినఖాగ్రములందుఁమీటుచున్
పీనపయోధరోన్నతవిశీలతనూరుహరోమహర్షణా
నూనముదగ్రదం బగు వినూత్నవిలాసుఁడ ॥చె॥ 43

చం॥ సరవిగ పారిజాతనగశాఖకమర్చినఁ దీఁటుయ్యెలన్
దొరఁకొని రాధతో ముదముతో కుచకుంభములాత్మవక్షమం
దొరయఁగ దూగుఁటుయ్యెలనుఁ దూగెదు నీ తులశీవనాంతరాం
తరపరిపూతకేళిమదినాఁట దలంతును ॥చె॥ 44

ఉ॥ చిత్తజబాణవహ్నులకుఁ జేవదొరంగి మనోరథప్రజం
బుత్తది సేయఁదూతికలఁ బుచ్చి రమింపఁగఁ దెచ్చినట్టి మే
నత్తను గూఁడు నిన్ను గనియాసలుబొంచెడి వల్లవాంగనల్
చిత్తములార దృష్టులను సిగ్గుగబుచ్చవె ॥చె॥ 45

ఉ॥ వాళిమయూరపింఛమొకమాదిరియైనమిటాగఁమొప్ప వా
హ్యాళివిభాకరాత్మజపయస్విని ఘట్టములందుఁగ్రోవి పా
టీలలఁగుత్తు గోపికలబెంకికి దెమ్మ్రఁ రాయఁభారిచే
వీలుఁగ బంపి వారి బిలిపించి రమింపవె ॥చె॥ 46

ఉ॥ సారసచక్రశబ్దములుఁ జక్కఁగ గ్రోవికి మేళవించి శృం
గారముగా విచిత్రపరికల్పితచంద్రశిలాభిరామమై
తీరుగనున్న మెట్ల పయిదేశమునన్ సుషిరంబునూదు నీ
చారుచరిత్ర నెంచెదను సారసలోచన ॥చె॥ 47

ఉ॥ కూటమికొప్పమిఁగినిని గోపముతోఁడ నిశీథమందు బృం
దాటవిలోని కుంజములఁదట్టుచు బోవ నొకానొకందు నీ
కూటమి నొల్లనట్టి యలకోపితరాధలభింప కేళిలో
మాటలులేక తృప్తిపడి మాయవచింపవె ॥చె॥ 48

ఉ॥ సంగరమందు పంక్తిశిరుజంపి విమానములో నయోధ్యకున
చంగునవచ్చి నేతవయి సౌధములోన మహీజతో సుఖా
నంగవిహార వర్తనలనన్యమెఱుంగక సేప్రజార్థి తా
సంగతినున్న నిన్గొలుతు సాగరభంజన ॥చె॥ 49

చం॥ ఎవని విహారకుంజముల కేగి నిశీథములందు కాంతునిన్
గనుటకు వార్చియున్న యలకొంతల కందరకన్ని రూఫ్రై

మనసిజతంత్రమందరు సమంబుగ బొందగ జేయు విశ్వరూ
పునినుపాపసంహరణ బుద్ధి దలంతును ||చె|| 50

---

## —♦ ప్రకృతిశతకము. ♦—

చం|| అరయ నిమేషమాదిగల యబ్దములెన్నిగతించు చాయువుల్
హరణమొనర్చి గానిసమయంబగు నొక్కనిమేషమందు నీ
స్మరణమెఱుంగ కాలమనిశంబునుబోయె వృథా! భవాబ్ధినే
సిధగమని నమ్మిబొందితినిఁజేటు జనార్దన ||చె|| 51

చం|| పనిగొని నిన్నొకండు బలవంతముఁజేయఁ దలంచు భక్తికిన్
గనుఁగొన నెంతపాటిదదిఁ గాలవశంబునఁ బక్వపాకమై
డనరనిదంచు నెంచ నిరతంబు ప్రయత్నమొనర్చుజాలమున్
మనుజుఁ డధోగతిన్ బడుట మానఁడు నింతకు ||చె|| 52

చం|| అరయుఁ నిమేషకాష్ఠఘటికాయామినిసంధ్యలుపక్షమాసవ
త్సరములనగ్గళోగ్రవిరతాశుభరంబునఁ నెల్లవేళలన్
గిరగిరఁ గాలచక్రము నొకించుకఁనాగక సిడ్డివేఁచె నం
దరఘుడియైన నిద్దలపనంతటి మూఢుడు ||చె|| 53

ఉ|| పూరివోడంగి బ్రహ్మకును భూషణదూషణలెన్ని జేసినన్
వాగకనిన్ను చెందును భువంబఖిలంబును నీవునిండుటన్
పేర్కొనడైన చెమ్మరకు రెగనిభిస్మముఁ నేమిఁజేయగా
గారణమౌను సర్వినటుగాదొకో దైవము ||చె|| 54

చం|| పరిచయ పండితోత్తముల భావములుత్తముగాదు గోత్రతా
గురువులభింప డెచ్చటను ఘోరవనంబుల నుండు నేమొ నా
పరిచయభాష్యపాళి బలవంతముసేయవు శంకబోవ నే
నరుఁడనుగాని కృష్ణుడిక నాకు లభింపడు ||చె|| 55

ఉ|| మీసలుగడమాన్చినిచి మీదికిబోఁవుట కూర్ధ్వకేశముల్
రాసులుగూర్చి ముక్తి పరంబగునట్టి విచిత్రమైన యీ

ఊసరవెల్లి దైవముల నూరక నేలవలంప భుక్తికిన్
బ్బాసి నిశిధమంతకును ప్రాప్యమ దేఁటిది ॥చె॥ 56

చం॥ నరుఁడవలెఁ గోరజాలదగ నంతటి నెమ్మివహింపలేమి నే
ద్విరదముపాల్కౌన శ్రిపరి దేవనలేమి వచింపనట్లు న
న్నరయఁ గుచేలుచందము కనర్హాము బాల్యమునందునట్టిదా
పరిచయమేమి లేదిక భవాశ్రియమండెను ॥చె॥ 57

చం॥ దొరకొని చింతసేయుటకుఁ దోఁచని భూరివిశంకటోన్నతా
భరమగు భీతిహేతువు భవాద్రి శిరంబునఁ బాల్చి లేమికిన్
భరపడి ముందుబోవఁ దరువాత్లువహించి ననిశ్చలాత్మ కా
తరమునఁ చేటునొందుటలు తథ్యము శ్రీధర ॥చె॥ 58

చం॥ దొరకొనిఁ దీవయుయ్యెలలఁ దోడను వల్లవపల్లవాధరల్
హరివగు నిన్ను నాథునిడి యామినులందు కళింగకుంజ మం
దిరములఁ బూర్ణచంద్రికళ దేజముసంగ కళిందజాసరి
ద్దరులను నూచుభంగులు ముదంబున నెంతుచు ॥చె॥ 59

ఉ॥ వానుడిమాఁటపోకడల నాటికి నాఁడు దెలుంగు బాసలో
నానుడి ఛన్నశబ్దమది నాడగ చెన్నయటంచు మార్పుకున్
స్థానమునొందె శ్రీధకృత తామరసాక్ష మనోజపాయ సం
ధానకపావివాహగిరి ధారణ శ్రీధర ॥చె॥ 60

---

## మానసశతకము.

చం॥ అలయను సగ్గుచెందను మహాద్భుతసంగతి నెట్టివస్తువుల్
గలస్జినించె మానసము గాసిలక్షోక్కక్షణంబులోన వం
దలు పదినూర్లు లక్ష లయుతంబులు సర్బుద సంఖ్యలైన వాం
ఛలు జనియింపజేయుఁటకు సారసలోచన ॥చె॥ 61

చం॥ తరుగని కామసంతతులఁ దామరతంపరలై యజస్రమున్
బెలుఁగునుగాని జాఁకవిలఁ బ్రీతివహించి ప్రపంచబాంధవం

బురలకయుండినన్ గుబుసమూడ్చుగతిన్ భవమూడ్చి నైజబం
ధురపరతత్త్వమందుట లధోక్షజ మోక్షము ॥చె॥ 62

చం॥ సిరిచెడి జీవయాత్రికతిచిక్కుఘటిల్లి హృషీకపాళి గో
చరవిముఖత్వమొందఁ మది చక్రివిచారముఁ జేసుకున్న దు
ర్భరపుమనోరథాళి సురవర్త్మవిమాన విహారులై మనో
భరమొనరించు ప్రాణికి సువర్ణనవాంబర ॥చె॥ 63

ఉ॥ వేసరవింద్రియంబులఁ దివిష్టపరాజ్యసుఖంబుగల్గినన్
చేసినసేతకున్ వనటజెందియుఁ బారెసుపక్రమింపగాఁ
తోసెనుగాని తృప్తిపడి రోయవు శేముషియింద్రియాళికి
న్బాసటయున్నచట్టు నిదినైజము వాఁటికి ॥చె॥ 64

ఉ॥ స్థితిచెడి పెంపుక్రుంగి తగుచేతలులేక కుమారులెల్ల దు
స్థితికిరవైన దుర్జనుడు చేటులొనర్చుచు జీవశేషమున్
బ్రతికిన వట్టుబుచ్చుటకుఁ బ్రాల్పడుగాని రమేశ నిన్ను నే
కతమున సంస్మరింప మది గాంక్షవహింపదు ॥చె॥ 65

## —♦ సాంఘిక శతకం ♦—

చం॥ వలచుట చక్కజేయుట శుభప్రదరూపము దాల్చుటాత్మ భ
ర్తల వికసింపజేయుట కరంబనురాగము విద్యనేర్వకే
గలిఁగిన నైజవర్తనజగంబలరించెడు విద్యనేర్చినన్
పొలతు లికెంతవారగునొఁ బుష్కరలోచన ॥చె॥ 66

ఉ॥ మోసము బానిసత్వ మిల మోసము వర్తకవృత్తి భిక్షదు
ష్ప్రాపము యాచకాళికి విపత్తు కవిత్వసమర్థనంబు ల
ధ్యాపకవృత్తి పంచమజనార్హకమయ్యెను యిట్టి సర్వలో
కాపదలందు సేద్యము సుఖంబిడు విప్రుక ॥చె॥ 67

చం॥ కలిమికిని న్దలంపఁడని గాఢదరిద్రిమొసంగి జూఁడని
చ్చలు సుతదారపౌత్రపరిచర్యకుఁ దానకనై భవాబ్ధిలో

కలఁగి దివాంధమబ్ధిపడిఁ గారియఁ ద్రుంగివరీతిఁ బోవు నీ
తలఁపు నెఱుంగ కజ్ఞుఁడిల తామరలోచన ॥చె॥ 68

చం॥ జనకుఁడు మాధ్వుఁ డాత్మజుఁడు శైవుఁడు గోడలు వైష్ణవంబు ద
మ్మునిడిగ ణేశ మాత్మసతి బుద్ధమతంబు పితామహుండు వా
మనము గభస్తిదైవమత మత్తిది గాగ గృహస్థులెం
దును జెడు నీప్రభుత్వమును దోఁడ నెఱుంగమి ॥చె॥ 69

## —♦ నీతిశతకము. ♦—

చం॥ కనుఁగొని రూపురూపవలెగాని వ్రణంబు ఋణంబు శేషముం
చిన పరశేషమట్లు కడుఁ జేటు సుబాహుల హతంబొనర్చి ద
మ్మును మిగిలింప లేడియయి మోసముఁ జేసి మహీజ లంకలో
మనికికి హేతువయ్యెఁగద మాధవ శ్రీకర ॥చె॥ 70

ఉ॥ సెల్లముజాఁడ శిష్యునకుఁ సేవకవృత్తి సతాగ్నిహోత్రికిన్-
బల్లెల ద్రిమ్మరం జనరు పాసపుఁ జారణితోడఁ గాపురం
బొల్లగరాదు మాఁట విననొల్లని దమ్ములఁ గూడియుండుటన్
జెల్లదు వల్లవాంగనల చిత్తమనోహర ॥చె॥ 71

ఉ॥ దానముగాదు ముష్టిగొల ధర్మముఁ జేసిన పాత్రపాత్ర తా
జ్ఞాన మెఱుంగకున్న బడజల్లిన మాత్ర ఫలింప దుర్వి సం
ధానరసార్ద్రకాలనియుతంబులు జూడకయున్న రాజస
న్మానముగాదు లోభికి జనార్దన ॥చె॥ 72

ఉ॥ పెట్టిననాఁడె చుట్టములప్రీతి గడించిననాడె భార్యతోఁ
బట్టు రమింప శత్రువులు పారుట శూరతజూపునాఁడె హోం
బట్టువుపాల్పుటంత కిరవైనధనార్జననాఁడె తీర్థముల్
మెట్టుట పిన్ననాఁడె పరమేశ్వర శ్రీపతి ॥చె 73

ఉ॥ యింటభుజంగమున్న దనకిష్టులు సోదర లీసు చెందినన్
తుంటరులైన యింటికిరుఁద్రోవలవాఁడు జరత్వజీర్ణమం

దంటలుఁ రాలుచున్నఁ దగ నావరణంబు వహింపకున్న నా
యింట వసింపరాదు నరుఁడెన్నఁడు శ్రీకర ॥చె॥ 74

చం॥ తనుఁగని చంద్రుఁడింద్రుఁడని దాఁచితదుర్విధులెల్ల నిత్యమున్
వినతులొనర్ప సాధులను వీఁడులంచు దలంచి గర్వకున్
గనకనశించుఁ గూళ సిరిఁగల్గిన యా నహుషుండు సాధులా
మునులఁ దిరస్కరించి చెడిఁబోవఁడె మాధవ ॥చె॥ 75

చం॥ వలతి కి నాఁడు సిద్ధముగ వచ్చిన సంపద హెచ్చుచుండినన్
దొలివగు వంశవర్తనపుఁ ద్రోకల బోవు చెవంటికబ్బలో
కులదగఁ ముంపు బోటుగనిఁ గూలము దాటదు సాగరంబు వా
కలుజడిపెటికొల్లబయి గాదె జరించును ॥చె॥ 76

చం॥ ఫలమొకయింతలేదుఁ పెఱవారల సంపద కీసుచెందినన్
కలఁత హృదంతరాళమునఁ గారియ వెట్టుట గాని సూర్యరో
చులఁ గలగుండుచెందిఁ గనఁజాడ్యము కేమికొఱంత కౌశికం
బులు దమగూండ్ల దాఁగుటలుఁ బోవునె శ్రీపతి ॥చె॥ 77

ఉ॥ చేవఁదొఱంగరాదు మృతిచేర్పడనున్న విడాకులిచ్చినన్
భావము చెప్పరాదు దనభార్యకు పాఁగరాదు పోరులన్
జీవితు తోడ మిత్రులకుఁ జేయదొఱంగరాదు బాసటల్
సేవనిలాటవేల్పులను నెంచగ రాదిల ॥చె॥ 78

ఉ॥ ఆడఁగజంకబోలదు సభాంతరమందు నిజంబు బంటుజ
క్కాడఁగరాదు దొయ్యలినిఁ గల్లవచింపగరాదు సర్వముల్
బాడగుచున్న నీతివినఁ బాధవహింపగ రాదు నెన్నఁడున్
వాదలరేవుటెంకి భువి పాఱుకుఁ జెల్లదు చెన్నకేశవా 79

---

## —♦ నిర్గుణశతకము. ♦—

చం॥ తనదగు నేర్పుఁచేత వివిధంబగు వస్తువులెల్ల జేసి తా
గనుఁగొని విస్మితభ్రములఁ గాంచడు గారడివాఁడు గాని నే

ఘనమగుమాయఁ గల్పితముఁగారడిఁజేసి భ్రమించి శాశ్వతం
బనుమతివాడి మోసపడి సంతల జిక్కితి చెన్నకేశవా 80

ఉ॥ ఆదినసత్తు రూపవివిధాకృతిదోపకయుండ దానిక
త్త్వాదిది సత్తురూపవివిధాకృతులొప్పఁగ జేసి యన్నిటన్
మాదిరిఁ బట్టియున్న నిను మానవుఁడెవ్వఁడు విశ్వరూపిగా
గాదనకెంచువాఁడు నినుఁ గాంచినవాఁడిల॥ చె॥ 81

ఉ॥ కోరికలెన్నియేనిఁ గలుగున్ సంకింపమనోరథవ్రజం
బూరకఁ బోవఁజాలను సముద్భవకారణమూలవాలమై
వేరిడు మూలమున్న మఱి వేల్చుమి తత్త్వపథాగ్నిదపి సం
సారమసత్యమన్నుజావుసల్ప మురాంతక ॥చె॥ 82

ఉ॥ మూలమెఱింగి చిత్తమున మోహము జంపి తురీయభావనా
లోలుఁడు జాగ్రత్స్వప్నములోఁబడి తత్త్వము విస్మరింపఁగా
బోలఁడ నేకవాశితరవోక్తులు దాటిమురారిగ్రోవిదౌ
యీలలెఱుంగుఁ గోపికల యీప్సిత మట్టులు ॥చె॥ 83

ఉ॥ మాయికులోనుగాక వనమాలిని నిన్నుదలంప జీవులన్
పాయక జీవరూపివయి వర్తిలుటన్ గనుగొంచుఁదా నిరా
పాయపరోక్షసాక్షివిగ భావనసేయు సుషుప్తికావలన్
మాయకతీతతత్త్వమయిఁ మానక భాసిలు ॥చె॥ 84

చ॥ కడలిజలంబు దెచ్చియొక కాచఘటంబునఁబోయ దానికే
ర్పడిన వికారమంబువుపరంబగునట్లు భవాంశమైన యీ
జడుఁడు నుపాధిబాసి నిను సత్వరమొందును కాచనీరముల్
జడనిధిమిశ్రమింపబడు జందమునన్ దగ ॥చె॥ 85

చ॥ దొరసి సజీవుడైనపతితో రతికిన్వలపించి బాహుబం
ధురపరిరంభచుంబనవిధుల్ ఒరగించిన భార్య ప్రాణముల్
దొఁగిన యాశరీరమునుఁ దూరమునుండిభయంబు తోఁజూ
పరలగఁ జూచు నీవరుఁగఁ వట్టిది దేహము ॥చె॥ 86

మ॥ కలిగినశంకలన్ విడచిఁ గాయము ద్రిప్పఁగమూలమైన యే
దెలివి నిరంతరంబుఁ దనతేజము పెంపున జీవభావమున్
గలుగఁ జరించి సంసరణ కర్మనిబద్ధముజేయుచున్న దా
తెలివి పరాత్పరుండనుచు దేలుటలేదొకో ? ॥చె॥ 87

ఉ॥ సూచనకైయరుంధతినిఁ జూపుటకాది ధృవుండులోనుగా
జూచుటకొనువాఁటిదొలి జూపువిధంబున కోశజీవులన్
జూచుట నేర్పి వానిదగ జూచినవెన్కఁ దదంతికంబులోఁ
నైచి గ్రహింప నీకనుచు సజ్జనులాడిరి ॥చె॥ 88

ఉ॥ పాతకుడైన ప్రాణము విపద్దశనున్న నిబద్ధుడైన జీ
వాతువుబోయినన్ సుతులుపంచతనొందిన లేమిగల్గినన్
నాఁతిసుతుండుఁ దన్నువిడనాడిన సర్వవిచారశాంతిక
నైవ్రతము కన్ననన్యము శుభంబిడజాలను ॥చె॥ 89

ఉ॥ కొన్ని పవిత్రముల్ సలుపఁ గూర్చికిశాస్త్రములందు శక్తిమే
కొన్న గతిన్ స్వతంత్రమునఁ గొంచముఁ జేకొనఁలేని జీవికిన్
గొన్నిటలోకతంత్రములఁ గూర్చునిమిత్తము పేరుమాత్రకున్
గన్న యధేచ్ఛ కాత్మకులుకద్దగదక్కట ॥చె॥ 90

చం॥ ఫలముభవార్పితంబనుచు బాయకఁజేసెడి కామ్యకర్మలన్
గలుఁగుఫలంబుజన్మలిడుఁ గారణసంచితమంచుగూడకే
వాలియుఁ బాలంబులూష్పటకుఁబోయెడిఁ గూలిజనంబులూడ్చియున్
ఫలముగణింపనట్లు పలుబాధలనొందియు ॥చె॥ 91

చం॥ మనలను వేరుగాఁగ జలశూవిరిజేసి ఘటంబులోన బం
ధనమొనరించిదానికి యధార్థపుమేఘము నొందనీక మా
తినిబిగియించినట్లు ననుఁదేహములోనఁ బిగించి మాయయన్
ఘనమగు పెండువన్నదెర గారియఁబెట్టెడు ॥చె॥ 92

ఉ॥ మేఁకొని సాధనంబులను మేకుబిగించి ముఖ్యమైన యా
పీఁకిబిగింపుమాయ విడిపించిన వైశమ నిన్నుజేరుదున్

పోకువచింప నేల నిక సాధనకోటులభింపలేదు ని
న్నేకరణిన్ భజింపవిడి నెట్టులుఁజేరుదు ॥చె॥ 93

ఉ॥ లోకులు నిటియా విరి విలోలనశక్తి ని లోకతంత్రముల్
వీఁకనిజోపయోగమున విల్చుగటన్ ననునీశరీరమం
దేకముగాగ జీవమతి నెక్కొని భేదమెనర్చి మాయయన్
లోకుడు వృద్ధిచెందెడు విలోకనజేయుము ॥చె॥ 94

ఉ॥ స్థూలముకంటెనింద్రియతతుల్ కడుచేవ హృషీకపాళికు
ద్వేలము మానసంబుమఱిఁ వేయిమడుంగులు దానికంటెనుం
బోలుఘనంబు బుద్ధిఁదగ బుద్ధికతీత పరంబుసాక్షియై
గ్రాలెడిదాత్మ నాత్మ నెఱుగన్వలె ముక్తికి ॥చె॥ 95

ఉ॥ పాఁరెకు నిచ్చనామదిని సంగతమైన పరిత్రలోనిరా
ధారమవిద్యబంధనకుదార్చి విపత్తునొసంగునంచుప
ల్మారు గణించినిర్గుణఫలాప్తికిమానసమడ్డిఁదాళిచిన్
గోరి భజింతునిన్నెపుడు గోవ్రజమందిర ॥చె॥ 96

ఉ॥ వాఁరక నేనుతించు భగవంతుడు మామకమానసేంద్రియా
గారవిలక్షణోజ్జ్వలవికారనిరంజనచిన్మయుఁడిదా
కారుడు గాని యీపురిని గల్గు మనోహర చెన్నకేశవా
కారుడు గాడు బొంకఁగడగండ్లకుమూలము ॥చె॥ 97

ఉ॥ నేనన నీవు నిచ్చలునునీకును నాఁకువిభేదమేమియున్
గానఁగలేదు గాన దరిగానని మాయదగుల్పడంగ సం
ధాన నిదానమడ్డిన పరిధానము నీవను భ్రాంతినుండుటన్
మానవజన్మ మెత్తుటకు మానుట లేదిల ॥చె॥ 98

చం॥ అనయము నేఁదలంచు పరమాత్మమదీయహృదంతరాళరం
జనరుచిరంబుగాని పరిసంగతకంకణపారితథ్యకాం
చనరసనాదిమండిత దళాంచితపీతదుకూలధారియౌ
మనుజుడుగాడు గాడరయ మాయకతీతుడు ॥చె॥ 99

ఉ॥ బాలుఁడ మానసంబుపరిపక్వము నొందగ నేడు నేర్పుకన్
జాలి నుతించినాడ ననుజాగొనరింపక భక్తపాలనా
శీలుఁడవన్న సిరియుఁ జేవహొరంగక యుండప్రీతితో
పాలనసేయవేడెద కృపార్ణవ శ్రీధర ॥చె॥ 100

చం॥ అడుగుటలేదుసంపదల కోశవహింటచులేదు రాజ్యమం
దొడయనిజేయ నింకమదిఁ నున్న దివానక వేడుచుంటిని
యడుగులభక్తి దప్పఁ మఱియన్యము వేడను వేడవేడనో
జడధిశయాన కృష్ణ జలజాయతలోచన చెన్న కేశవా 101

చం॥ పొరసినవేళలన్ గృషికిబోవుచుఁ దెన్ను లభింపకాలమున్
జెలుపక బూర్వజోదితవశీకరవర్తనతోడనిత్యమున్
వరపితి సిశతంబు నొకవారములోఁ భకదీయదాసుడన్
గరిమెళవంశసాగరమ్ము గాంకుడ కృష్ణుడ చెన్న కేశవా! 102



సీతారామా ముద్రాక్షరశాల, నరసాపురం. ప॥ గో॥ జిల్లా.

# ERRATA.

| పుట | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 2 | 6 | 2 | దలంతుమఃందటన్ | దలంచెదన్ |
| 3 | 17 | 4 | వష్ఠ | వరిష్ఠ |
| 7 | 40 | 2 | ఛా | చా |
| 7 | 48 | 4 | దృ | పృ |